3

Reg. No. 757.

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.




జనపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

జానపాడు.

సంపుటము 17 | 1926 సం॥ జనవరి నెల | సంచిక 10

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0·0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, వెనికేపల్లి.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, వైకుంఠపురం.
౩ బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాదవరం.
౪ రామశింగుగారు- నెల్లుట్లసాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.

## పోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు.
౨ ఎనమంద్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
౩ రాజా వెంకటాద్రియప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగి
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
౬ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి, దేశముఖుగార్లు- నారాయణపురము
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జోనగాం
౧౧ నెల్లుట్ల నరసింహారావుగారు, జోనగాం
౧౨ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.
౧౩ టేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౪ జాగర్లమూడి కుప్పుస్వామినాయఁడుగారు, కారంచేడు
౧౫ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౬ యార్లగడ్డ రంగనాయకులు నాయఁడుగారు, కారంచేడు
౧౭ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, సిరిసిల్ల.
౧౮ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానెకొండూరు
౧౯ పొట్లపల్లి జగన్నాధరావు దేశముఖుగారు, అశ్వారావుపల్లె

---

## సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౩ సంగెం రామారావుగారు, సంగెం
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ రంగావఝల రంగయ్యగారు, నర్సారావుపేట
౭ నారాయణరావుగారు, దాతారుపల్లె

## చందాదారులు.

1 కోన రాఘవయ్యగారు, పెంటపాడు.

2 మైలవరము కృష్ణమూర్తిగారు, కంట్రాక్టరు, ఏలూరు.




3 శంకరమంచి అన్నయ్యశాస్త్రిగారు, చినవోగిరాల.

4 పిల్లలమఱ్ఱి రామమూర్తిగారు, తెనాలి.

5 పుల్చి రామయ్యగారు, పేకెలపూడి.

6 మోతె నారాయణరావు బహదరు జమీందారుగారు, ఏలూరు.

7 వేలమూరి వెంకటసుబ్బారావుగారు, డి॥ మున్సీఫ్, విశాఖపట్నము

8 కొండుభట్ల గోపాలకృష్ణయ్యగారు, ప్లీడరు, నర్సారావుపేట.

9 కంచెర్ల లక్ష్మయ్యగారు, ఫారెష్టరు, అడవులదీవి సెక్షన్

10 తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు, చందోలు.

11 అక్కిరాజు వాసుదేవరావుగారు, కరణము, గుత్తికొండ.

12 లంకా వెంకటనారాయణగారు, పందిరిపాలెము.

13 భమిడిపాటి సుబ్రహ్మణ్యముగారు, పెదపులివఱ్ఱు.

14 కంచిరాజు లక్ష్మీనరసింహముగారు, ప్లీడరుగుమాస్తా, కడప.

15 మంత్రిప్రెగడ భుజంగరావు బహదరు జమీందారుగారు, ఏలూరు.

16 విరివింటి విశ్వనాథయ్యగారు, వోర్వకల్లు.

17 గుండు శేషయ్యగారు, స్కూలుమేష్టరు, చేటపఱ్ఱు.

18 మొసలి పాపిరెడ్డిగారు, పటేలు, కొమ్మేపల్లి.

19 కాచరాజు రామచంద్రరావుదేశపాండ్యాగారు, సింగరాజుపల్లె.

20 యువజనసంఘము, జొనగాం.

21 రాయచూరి బండేరావుగారు, అయినాపురము.

22 గూడ వెంకటరామారెడ్డి దేశముఖుగారు, ఇటికాలపల్లి.

23 సి. విఠలరావుగారు, దివాన్ దేవిడిసదరుమహాసభ, హైదరాబాద్.

24 చతుర్వేదుల ధర్మారావుగారు, అకౌంటెంటు, పోలీసుడైరెక్టరు
జనరలాఫీసు, హైదరాబాద.

25 కనకదండి సూర్యనారాయణరావుగారు, సబిన్స్పెక్టరు, పరిగి.

26 కృష్ణాజినాయకుగారు, హైదరాబాదా.

27 దిడ్డిగ నారాయణగారు, మునగాల.

28 రాఘవరావుగారు, కరణము, మునగాల.

29 సీతారామారావు దేశపాండ్యాగారు, తేరుపల్లి.

30 రంగరాజు మోధీరాంగారు, ముసలాపురము.

31 జూపూడి నారాయణరావుగారు, అక్టింగుకరణము, గడిపెద్దాపురం.

32 తిగుళ్ళ మల్లారెడ్డిగారు, పటేలు, గడిపెద్దాపురము.

33 శ్రీరామగ్రంథాలయము, అందోలు.

34 కమలంపేట రాఘవులుగారు, ఇస్మాయిల్ఖాన్ పేట.

35 నరసింహారావుగారు, కరణము, బొంతపల్లి.

36 కొండంభట్లగారి వెంకన్నగారు, గుమ్మడిదల.

37 బాకరాజు రాజేశ్వరరావు దేశముఖుగారు, దుండిగళ్ళ.

38 టంగుటూరి శ్రీనివాసరావుగారు, దుండిగళ్ళ.

39 ఇంద్రకంటి బలరామయ్యగారు, మేడిచెలిమ.

40 మహావాది పాండురంగశాస్త్రిగారు, కేశవాపురము.

41 వెల్లాల సదాశివశాస్త్రిగారు, కొల్లాపురము.

42 ఇంద్రకంటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కర్నూలు.

43 భాగవతుల సూర్యనారాయణగారు, కొల్లూరు.

44 కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు, ఏలూరు.

45 శిష్టా వెంకటకృష్ణయ్యగారు, ప్లీడరు, బెజవాడ.

46 పూటుకూరి వెంకటేశ్వరులుగారు, చీరాల.

47 గోవిందరాజుల మాధవరావుగారు, నగదుకార్ఖాను, సిద్దిపేట.

48 చేపూరి లక్ష్మీనరసింహారావుగారు, తాలూకాపేష్కారు, సిద్దిపేట.

49 కాసర్ల లింగయ్యగారు, పటేలు, కినగర్తి.

50 వేమూరి చెంచుకృష్ణయ్యగారు, స్కూల్మాస్టరు, నలదలపూరు.

# అభినవసరస్వతి

సంపుటము ౧౭ | జానపాడు. క్రోధన సం॥ పుష్యమాసము. | సంచిక ౧౦

## యాదగిర్యుత్సవము.

ఈ శీర్షికగల వ్యాసమును మాపత్రికలోఁ బాఠకులు పలుమాఱులు చదివియున్నవారు. అయినను మరల నొకపర్యాయము చదువఁ బ్రార్థితులు. ఈ యాదగిరి యనునది నిజాము రాజ్యమునకుఁ జేరిన నల్లగొండజిల్లా భువనగిరితాలూకాలోని యొకపర్వతము. ఈపర్వతముపైని శ్రీలక్ష్మీనరసింహస్వామి యెప్పుడు వెలసెనో యేమో భక్తులచే సేవింపఁబడుచుఁ బ్రతివత్సరము మార్గశిరపూర్ణిమను గల్యాణోత్సవాది కైంకర్యములు చేయించుకొనుచున్నాఁడు. ఈపర్వతము ప్రక్క యాదగిరిపల్లెయని యొకయూరు గలదు. దానికి బీరకాయల రామారావుగారను నొక దేశపాండ్యా సర్వాధికారములు వహించి యుండుచుండెను. ఆయన రాయగిరి స్థిరనివాసముగాఁగలిగి యాదగిరిపల్లెలోఁగూడ మిద్దెలు మేడలు కట్టించి యప్పుడప్పుడు వసించుచుండెడివాఁడు. శ్రీ యాదగిరి లక్ష్మీనరసింహస్వామి కైంకర్యాదులలో నీయనదే ధర్మకర్తృత్వము. ఆ స్వామివారి కర్చకులు రాయగిరివాస్తవ్యులైన యొక స్మార్తకుటుంబమువారు. వారియొద్దఁ గవులుకుఁదీసికొని విశిష్టాద్వైతులు తదర్చకత్వము నెఱవేర్చుచు వచ్చిరి. ఆ స్వామికివచ్చు కానుకల నర్చకులే తీసికొని నిత్యనైవేద్యదీపారాధనకల్యాణోత్సవాదులఁ జేయించుచుందురు. ధర్మకర్తలు వారిమీఁద యాజమాన్యము వహించి పరిశీలించుచుఁ దమశక్తికొలఁది మఱికొంత సొంతద్రవ్యమునే వ్యయపెట్టుచుందురు. కాని కోటప్పకొండమీఁది ధర్మకర్తలగు నరసారావుపేట జమీందారులుంబోలె స్వామికివచ్చు సర్వస్వమును హరించి యాత్రికులసౌకర్య మరయుభార మన్యులపై వేయ నుంకింపరు. అట్టి ధర్మకర్తల సాహాయ్యముతో నర్చకులగు రాయగిరి స్మార్తకుటుంబము వారిదగ్గఱఁ గవులుపొందిన విశిష్టాద్వైతులు క్రమముగా నరసింహ

స్వామి యుత్సవము నభివృద్ధికిఁ దెచ్చి వేనవేలభక్తులఁ దత్సేవార్థమాకర్షింపఁగలిగిరి.

ఉత్సవసమయమున నేకాక యితర సమయములందును రోగగ్రస్తులు సంతానకాములు మున్నగు జను లనేకు లరుదెంచి యీ నరసింహస్వామికిఁ బ్రదక్షిణనమస్కారసేవాసత్కారాదు లాచరించుచు నెలలకునెలలు నివసించి పోవుచుందురు. అందువలన నెలకు రమారమి ౧౦౦ రూపాయలు స్వామికి వచ్చుచుండును. ఉత్సవ సందర్భమున ౧౦౦౦ రూపాయలే యొనఁగూడెడి. ఇంత యాదాయము కలిగి యున్నను ధర్మకర్తలు వానిలో గవ్వయేని తా మభిలషింపక యర్చక ప్రతినిధులపైననే యీ భాగమంతయు నునిచి పరిశీలనమట్టుకే తమ పైని బెట్టుకొనియుండిరి. అయ్యర్చకప్రతినిధులలో రాను రాను బరాంకుశం శేషాచార్యులనువారు ప్రబలులై యనేకవిధముల నర్థమార్జించి యయ్యర్థమును స్వామి యాలయగోపురప్రాకారాదులకు వినియోగించుటయే కాక విద్వద్బ్రాహ్మణాది సత్కారమునకుఁగూడ వినియోగించుచు విశేషయశమార్జించి తత్స్థలమాహాత్మ్యమునుగూడఁ బెంపొందించిరి. వేయేల, ఆత్మకూరు గద్వాల మున్నగు రాజసంస్థానములం బోలె విద్యాధికుల కధికారానుగుణముగా సత్కరించుచు నాస్థలము గూడ నొక ధర్మసంస్థానముగా నొనరించిరి. అయితే, నా శేషాచార్యులుగారు విశేషము గానలోలురు. పురుషముఖమునుండి వెడలు గీతి కంటె స్త్రీముఖమునుండి వెడలు గీతికి నృత్యాభినయాది విశిష్టమై యుండుట మఱింత రమ్యతయుండుట రసికజనవిదితము. కనుకనే గానలోలురగు శేషాచార్యులుగారు సంగీతమునకుఁ, దత్రాపి స్త్రీముఖోద్గతమున కధికాదర మొసంగిరి. ఇతరస్త్రీలలో సంగీతవిదుషులే యుండరు. ఉన్నను బురుషభూయిష్ఠములగు సభలలోఁ బాడరు. అట్లు పాడువారు వారస్త్రీలు. కావున సభ్యోత్థాన ప్రత్యుద్గమాభివందనాసనప్రదానాద్యవశిష్ట సత్కారములలో నించుకంతయాధిక్య మామ్నాయతర్కవ్యాకరణాదివిదులగు నవనీసురులయెడలఁ జూపించినను విత్తప్రధానమునమాత్రము పడుపువేశ్యకాంతల మొదటి తరగతిలోను గాయకుల రెండవతరగతిలోను హరికథకుల 3 వ తరగతిలోనుఁ జేర్చి కవు

లను శాస్త్రజ్ఞులను వేదవిదులను నాలుగై దాటు తరగతులలోఁ జేర్చిరి.

ఈతారతమ్యమున కేమిగాని యన్నితరగతులవారి యెడలను నాయనయగుపటు చెడి యాదర మత్యంతశ్లాఘ్యము. ఆస్థలమహాత్త్వము విస్తీర్ణముచేసి యయ్యుత్సవమున విద్వత్సత్కార మారంభించి యశో వల్లిక నఖిలదిశలకును బ్రాకించిన యాయాచార్యులుగారు మహనీయులే. ఒక్కొకవిద్య కొక్కొక పరీక్షాధికారి చొప్పున నన్నివిద్యలఁ గూడ నాదరించుచున్నను నాస్థానవిద్వాంసులన్న ఖ్యాతి సంగీతవిద్వాంసులగు పాపట్ల కాంతయ్యగారికే వచ్చినది. ఈవిధంబునఁ దత్స్థలంబునకును దనకును ధనయశస్సుల నార్జించుచు మించిన శేషాచార్యులుగారు తత్స్థలీయార్చకులు రాయగిరి స్మార్తకుటుంబము వారనియుఁ దాము తత్ప్రతినిధులనియు మఱచిపోయి యచటి యర్చకత్వమే కాక ధర్మకర్తృత్వముగూడఁ దమదేయన్నట్లు ప్రవర్తింపఁ జొచ్చిరి. చొచ్చుటయే కాదు. అందులకుఁదగిన కట్టుదిట్టములు చేసికొనసాగిరి. రాయగిరిస్మార్తకుటుంబమువారిని దమ నవుకరులఁగాఁ జూడఁ గడఁగిరి. రాయగిరి యాదగిరిపల్లెలకు దేశపాండ్యాలును యాదగిరికిధర్మకర్తలును నగు బీరకాయల రామారావుగారితోఁ జాలకాల మత్యంత స్నేహభావముతో నుండియుండి తుదకు వారియెడలఁగూడ నిర్లక్ష్య భావము వహించిరి. అంత నా రామారావుగారును శేషాచార్యులు గారును నొకరినొకరు వశులఁజేసికొనఁ బ్రయత్నించిరి. రామారావుగారు రాజకీయభాషాకోవిదులును దూరదర్శులును నై కొంతకాలము రాజకీయోద్యోగులుగా నుండియున్నవారగుట రాయగిరి స్మార్తకుటుంబము వారిని లేవఁదీసి వారిచే నర్చకత్వమునుగూర్చి శేషాచార్యులుగారిపై నభియోగము దెప్పించిరి. ఆచార్యులుగారు ప్రతిఘటించిరి. అయిదారు సంవత్సరములు వ్యవహారము నడచెను. చివరకు శేషాచార్యులుగారిని దొలఁగించి రాయగిరిస్మార్తకుటుంబమువారికే యాహక్కు స్థిరపఱచి ప్రభుత్వమువారు బలాత్కృతినై యె శేషాచార్యులుగారిని గిరినుండి క్రిందికి దింపిరి.

రాయగిరి స్మార్తకుటుంబమువారిలోఁ బ్రస్తుతమందున్న హక్కుదారులు రాధాబాయియనునామె. ఆయమ యీయింటి యాఁడుబిడ్డయగుట ననాజిపురము సీతారామయ్యయనువారి కిచ్చి వివాహముచేసి యిల్లఱికముంచుకొనిరి. కావునఁ బ్రకృతపు యాదగిరి యర్చకత్వవ్యవహార మంతయు సీతారామయ్యగారి యాజమాన్యముతోనే జరుగుచున్నది. కాని యథాపూర్వముగా విష్వగమవిధిప్రకారము వైష్ణవులద్వారముననే స్వామిసేవ లన్నియు జరుపఁబడుచున్నవి. ధర్మకర్తలగు బీరకాయల రామారావుగారు దేవుని యాలయగోపురప్రాకారాదుల నభివృద్ధికిఁ దెచ్చుచుఁ గ్రొత్తగా రథమును జేయించియు వాహనముల నిర్మింపించియు ననేకవిధముల నౌన్నత్య మొనఁగూర్చుటయే కాక విద్వత్సభలు మొదలగువాని యుపయోగార్థము మిద్దెలు మేడలు సొంత సొమ్ముఁ బెట్టికట్టించి యాదగిరి కంతటికి వన్నె దెచ్చిరి. ఉత్సవకాలమందు వచ్చెడి బ్రాహ్మణుల కందఱికి నన్నప్రదాన మొనరించుచు నితర యాత్రికులకు వసతులు కల్పించుచు నేవిధమైనలోపము లేకుండఁ గని పెట్టిరి. ధనవంతుల ననేకులఁ బ్రోత్సాహపఱచి గట్టుంతటను డాబాలు కట్టించిరి. వేయేల, నిమ్నోన్నత ప్రదేశముగానుండిన పర్వతముపై సమభూమిఁ జేయించి స్వామి రథోత్సవాదులు జరుగుటకును యాత్రికుల యఖిలసౌకర్యార్థము రాజవీధులే నిర్మింపించిరి. ఇట్లు యాదగిరిపైని యధికారమంతయు రాధాబాయి సీతారామయ్యలదైనను ధర్మకర్తృత్వముతోపాటు వారిపై సర్వకర్తృత్వము వహించి సర్వము చక్కఁజేయుచు వచ్చిరి. అట్టిరామారావుగారు క్రోధనసం॥ భాద్రపదమాసమునఁ గాలధర్మము నొందుటయుఁ దత్కుమారులగు హనుమంతరావుగారు బాలురయ్యు నేవిషయమునను దండ్రికిఁ దీసిపోక సర్వము యథాపూర్వముగా నిర్వహించిరి.

ఈసంవత్సరపుఁ గల్యాణోత్సవమున రామారావుగారు స్వర్గతులైరను విచార మొకటితప్ప యాత్రికులకుఁ దక్కినలోప మిసుమంతయు లేకుండ నరయఁగలిగిరి. దీర్ఘాయురారోగ్యైశ్వర్యాదులు గలుగ దీవింపఁబడిరి. తత్సమయసముదితంబులగు చివుకుల వెంకటాచల శాస్త్రిగారి యీ యాశుపద్యంబులం దిలకింపుఁడు.

మ॥ మును ప్రహ్లాదుని బ్రోచినాఁ డట నృసింహుం, డంత శ్రీరాముఁ డా
హనుమంతుం గృపఁ జూచినాఁ, డిచట నేయాశ్చర్యమున్ లేదు, నేఁ
డనఘుం డైన నృసింహమూర్తి పరమాహ్లాదంబు సంధిల్ల నీ
హనుమంతాఖ్యుని బ్రోచుటం దలఁపఁగా నాశ్చర్యమై తోఁచెడిన్

కం॥ ఆయుర్వర్చోయశములుఁ గాయమునం దధికబలముఁ గలిగెడిరీతిన్
బాయక శ్రీనరసింహుఁడు హాయిగ రక్షించుఁగాత హనుమదభిఖ్యున్

ఈప్రకారముగా స్వామిసేవాసత్కారములును బ్రాహ్మణాన్నప్రదానమును విద్వత్సత్కారములును యాత్రికుల సౌకర్యమును సర్వమును హనుమంతరావుగారును సీతారామయ్యగారును యథాపూర్వముగా నిర్వహించి స్తోత్రపాత్రులయిరి. శేషాచార్యులుగారికాలమున విదుషులైన వేశ్యలకును రామారావుగారికాలమున గాయకులకును మొదటితరగతిసత్కారము చేయఁబడుచు వచ్చినది. రామారావుగా రొకమెట్టుకు దించిరి. తత్పుత్రులగు హనుమంతరావుగారును సీతారామయ్యగారును క్రమముగా మొదటితరగతిసత్కార మెవరికి విధింతురో చూడవలసియున్నది. ఈసంవత్సరపు ఉత్సవములో మఱియొక కలహబీజము విశిష్టాద్వైతులచే నాటఁబడినది. అదియెద్దియనిన నీక్రింది యంశములను దిలకింపుఁడు.

"ఆర్యులారా!

స్వామికోవెలయం దీయఁబడు తీర్థప్రసాద శఠగోపాక్షతాదులు మా మతస్థులకు మొదట కావలెనంటె మామతస్థులకు మొదట కావలెనని త్రిమతస్థులును వివదించుచుఁ గొన్నిదినములనుంచి యక్షతలెవ్వరికి నీయకుండ నున్నందునఁ బ్రస్తుతము జరుగుచున్న యుత్సవమునకు విచ్చేసిన త్రిమతస్థులరగు మీర లిది మొదలుకొని కోవెలలో నీయఁబడు తీర్థప్రసాదాదు లేమతస్థులకు ముందీయవలెనో శాస్త్రముచే నిర్ణయించి పత్రిక దయచేయింపఁ బ్రార్థితులు.

సీతారామయ్య,
దేవాలయాస్థానాధిపతి."

అటుపై సభికులగు త్రిమతస్థులు చాలమంది సభయందుఁ గూడిన త్రిమతస్థులలో నెవరు విద్యాధికులో వార లగ్రపూజ్యులని యేకకంఠముగాఁ జెప్పిరికాని కొంతమంది విశిష్టాద్వైతు లద్వైతుల చేతిమీఁదుగా నిచ్చునపుడు విశిష్టాద్వైతులకును వారి చేతిమీఁదుగా నిచ్చునప్పు డద్వైతులకును నిచ్చుట భావ్యమని యభిప్రాయపడిరి. ఇది విశిష్టాద్వైతు లర్చకత్వము చేయుచున్నను హక్కు-సీతారామయ్య గారిది కావున విశిష్టాద్వైతులచేతిమీఁదుగా నిచ్చినను సీతారామయ్య గారి చేతిమీఁదుగానే యిచ్చినట్లగుననియు నందువలన విశిష్టాద్వైతులకే యగ్రపూజ జరుగుననియుఁ బన్నిన కుట్రగాని వేఱుకాదు. ఈకుయుక్తి యైనను నందులోఁ బెద్దమనుష్యులు పన్నినదే. సీతారామాచార్యులఁట; ఆయన విష్ణుస్థలములలో సర్వాధికారము మాదే కావున నగ్రతాం బూలముగూడ మాదే యని తగవులాడుచున్నవాఁడు. తెర వైచి కొనియో వైచుకొనకయో జరిపెడి విష్ణ్వాగమ సంబంధికార్యములలో నితరమతస్థులకు సంబంధము లేకుంకిని విశిష్టాద్వైతులకే యగ్రపూజాది సర్వాధికారము నుండునుగాని మతత్రయమువారును జేరి చేసెడి స్వస్తివాచనసభలలో వారి కొక్కరికే యేలయుండునో విచార్యము.

ఈతగవులలోఁ దుద కత్తుతేలు ప్రథమ మెవ్వరికి నీఁదోఁపక యొక పళ్ళెరమందునిచి పనిజరిపిరి. శ్లో॥ విత్తం బంధు ర్వయః కర్మ విద్యా భవతిపంచమీ। ఏతాని మాన్యస్థానాని గరీయో యద్యదుత్తర॥ మ్మని మనుస్మృతి. విత్తబంధువయఃకర్మవిద్యలకుఁ గ్రమముగా నొక దానికంటె నొకదానికిఁ బూజ్యత విధించియుండ వీనిలో నొక్కటియుఁ గాని మతమునుబట్టుకొని పెనఁగులాడుట యవిచారితము. ఈకలహ బీజమును మొక్క-మొలిచి చెట్టుకట్టకపూర్వమే తుంచివైచుట శ్రేయ స్కరము. లేనిచో నీస్థలభాగమునకు మరల నేమియంతరాయము ఘటింపఁజేయునోయని కొందఱు భీతినందుచున్నవారు. బహుకాలము నుండి వచ్చుచున్న తమ యాగమవిధానమున కంతరాయము లేకుండ నర్చకస్వామి లాలోచించుకొందురుగాక. మితిమీఱినచో స్మార్తుల యధికారమునకు లోఁబడియున్న స్థలముల స్మార్తులే సర్వము నిర్వ హింపఁ గడంగుదురు.

ఇట్లనేకపత్రిక లస్పృశ్యతానివారణవాదమును ఖండించుచు శ్రీ మల్లాది రామకృష్ణవిద్వచ్ఛయులవారి ప్రకృతగ్రంథమున కూత యిచ్చుచున్నవి. ఒకపత్రికలే కాదు, పండితులే కాదు, సంఘసంస్కర్తల మనుకొను స్వరాజ్యకాములుదప్ప దక్కటిప్రజలలో నూటికిఁ దొంబదిమంది యీయస్పృశ్యతానివారణవాదమును బ్రతిఘటించుచునేయున్నవారు. పంచములే యస్పృశ్యులుగాఁ జెప్పఁబడుచుండిరని వారి నుద్ధరించుటకుఁగాఁ దలయుఁ దోఁకయుఁ దెలియక మనదేశనాయకులు పాటుపడుచుండిరికాని శాస్త్రములచే నస్పృశ్యత యొక్క పంచములకే నిరూపింపఁబడియుండలేదు. పైవర్ణములవారికిఁ గ్రిందివర్ణములవారందఱు నస్పృశ్యులగుచున్నారు. పైవర్ణములవారికిఁ గ్రిందివర్ణములవారే కాదు. ఒకవర్ణములోనే యస్పృశ్యత శాస్త్రసిద్ధమైయున్నది. జాతాశౌచమృతాశౌచాదులందు బంధువులే యస్పృశ్యులగుదురు. రజస్వలయైనసమయమున భార్యయే యస్పృశ్యురాలు. మడుగుగట్టుకొన్నప్పుడు తండ్రులకత్యంతప్రీతిపాత్రములైన కొమరులే మడుగుగట్టుకొననిచో నస్పృశ్యులు. మాలలు మాదిగలు నుభయులును బంచమశబ్దవాచ్యులేకదా! ఆమాలలకు మాదిగ లస్పృశ్యులు. వారికిని వీరికిని గల భేదభావమంతయుఁ బైని ప్రబుద్ధాంధ్ర చక్కఁగా నిరూపించియున్నది. దేశనాయకులమనియు స్వరాజ్యముసంపాదించి దేశమంతయు నేమో యుద్ధరింతుమనియుఁ ద్రిమ్మరు సంఘసంస్కర్తనామధారుల యస్పృశ్యతానిరాకరణవాదమును బ్రజ లెట్లుప్రతిఘటించుచుండిరో సికింద్రాబాదులో జరిగిన యీకలవరమును దిలకింపుఁడు.



XXXIV

# అస్పృశ్యతానివారణఖండనము.

గడచిన ( 10–11–25 ) తేదిని జంషిడ్‌హాలునం దాంధ్ర పత్రికాధిపతులగు మ-రా-రాశ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారును శ్రీఉస్మానియా యూనివర్సిటీప్రొఫెసర్ అగు మ-రా-రా రాయప్రోలు సుబ్బారావుగారును చండాలురచే సమకూర్చబడిన సభయందు నస్పృశ్యతా నివారణమునుగూర్చి గావించిన యుపన్యాసములు శాస్త్రాచారములకు విరోధములై లోకారిష్టదాయకములై యుండుటచే వానింగూర్చి ఖండనసభ రేపుఅనగా (12-11-25) తేదిని చేయునిశ్చయించినాము గాన మీరాసభకు తప్పక వచ్చి మీవాదము శాస్త్రవిహితమని సాధించుకొనుటయో లేదా తప్పని యొప్పుకొనుటయో కావలసియున్నది. గావున మీయభిప్రాయము వెంటనే తెలుపుడు. తెలిపినయెడల సభాసంబంధములయిన స్థలకాల నియమాదులను తెలుపుచున్నారము. అట్లు మీరు సభకు రాక మౌనమువహించి వెళ్లినయెడల మీవాదము నిరుపయోగమైనదని పత్రికాముఖమున వెల్లడింపగలవారమని ఒక జాబు బూర్వోక్తసభ కధ్యక్షులగు మ-రా-రా కా। నాగేశ్వరరావుగారికి ( 11-11-25 ) తేది సాయంకాలము 4 ఘంటలకు హైద్రబాదులోని రెడ్డిబోర్డింగులో పలువురు పెద్దమనుష్యుల యెదుట అందజేయ నుత్తరమును దీసికొని రసీదుపై సంతకము చేసియిచ్చి ప్రత్యుత్తర మీయకయే స్వదేశమునకు వెళ్లియున్నారు. కాన బ్రాహ్మణాద్యుత్తమ జాతీయులు చండాలురను, చండాలు రుత్తమజాతీయులను స్పృశింపకుండుట శాస్త్రాచారప్రాప్తమగు ధర్మము. ఈధర్మము నధర్మమనుకొని శ్రీయం. కే.. గాంధి మహాశయు లస్పృశ్యతానివా

రణము గావింపవలెనని బోధింప దదనుయాయులగు శ్రీ కా. నాగేశ్వరరావు ప్రభృతు లద్దానివ్యాప్తికై చేయుచున్న ప్రచారము శాస్త్రాచారవిరుద్ధమగుటచే ధర్మవినాశకమును లోకారిష్టదాయకమునునై యున్నది. కాన నింతటనుండి గాంధి, తదనుయాయులను లోకక్షేమమును గోరి యస్పృశ్యతా'నివారణమునుగూర్చి చేయుచున్న ప్రచారమును విరమింపవలెనని సగౌరవముగ గోరుచున్నాము.

ఈపత్రికయం దుద్దిష్టులయిన పై శా. నాగేశ్వరరావు పంతులు రా. సుబ్బారావుగార్ల శాస్త్రీయవాదమునకు శాస్త్రవిహితసభాముఖమున సమాధానమిచ్చుటకు సంసిద్ధులము.

యిట్లు విన్నవించువారు.

... ... ...
చివుకుల అప్పయ్యశాస్త్రి
చివుకుల వెంకటాచలశాస్త్రి
నారాయణం రాజనగసింహ (శాస్త్రి
ముదిగొండ బుచ్చయ్యలింగ (శాస్త్రి
చిరావూరి సీతారామశాస్త్రి
జగర్లపూడి అమరనాథశాస్త్రి
మల్లాది బలరామసిద్ధాంతి
కాండూరి సీతారామాచార్యులు
పమిడిమర్రి శ్రీశైలము
కప్పగంతు మార్కండేయశర్మ

శ్రీ. పం. మార్కండేయశాస్త్రి
బసవరాజు లక్ష్మీనారాయణ (శాస్త్రి
అడుసుమల్లి దత్తాత్రేయశర్మ
బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రి
రాచకొండ ఉమాకాంతశాస్త్రి
కోట విశ్వనాథం
నాగం కృష్ణారాయశర్మ
చారుగొండ నరహరి
రింగీతం రామచంద్రయ్య
పుట్టా ప్రకాశరావు
పుట్టా మాధవరావు
కాటూరం వినోభా

# XXXVI

ఉపరితనపత్రికాప్రచురణమునకు హేతుభూతులలో నొకరగు రాయప్రోలు సుబ్బారావుగారు తచ్చుండాలసభలో

సీ॥ మేఘగర్భమునుండి మేదినిబడ్డ చె
య్యాల మంచినీళ్ల గ్రోలరాదో
పంచలు గాకిదే ల్వాపటముగఁ బోవు
వీధులయం దేలవెళ్ళరాదో
కాయకష్టము చేసి గంజియంబలి ద్రావి
యూరినడుమ నేలయుండరాదో
భగవంతుఁడిచ్చిన పరమార్థవాక్యము
మనుజుఁడై యేటికి వినఁగరాదో

బోధపడ దీవిరుద్ధధర్మాధికార
సూత్రములను సత్యార్థ మేమాత్రమిపుడు
చచ్చిపుచ్చిన యాచారశల్యములను
బట్టిపూజింతురయ్యా తత్వజ్ఞు లెంకు.

సీ॥ సోమయాజికొమార్తె సూతికయై సీమ
బ్రాందీని సుఖముగాఁ ద్రావవచ్చు
అవధానికొడుకు క్రైస్తవకళాశాలలో
స్వేచ్ఛగాఁ జేముద్ద లీయవచ్చు
కోర్టులో వాయిదాకొఱకు హోటలుదూఱి
బహుముఖోచ్ఛిష్టమ్ముఁ బ్రామవచ్చు
తనపెండ్లికోస మాత్మతనూజఁ దెగనమ్మి
వృద్ధవిధురులు చరింపవచ్చు

ఏస్మృతు లనుజ్ఞలనొసంగె నీనికృష్ట
కర్మపరిణామసాంకర్యకాండకెల్ల

# XXXVII

ధర్మశాస్త్రప్రమాణాలు తడవనేల
ఆత్మవత్సర్వభూతాని యనరె బుధులు.

అనుపద్యములు చదువ వానికి బదులుగా సికింద్రాబాదునివాసులు శతావధాని చివుకుల వెంకటాచలశాస్త్రిగారీక్రిందిపద్యముల వ్రాసిరి.

శాస్త్రదూషక నిరాకరణము.

మ॥ కరజాలంబులఁ గౌఁగిలించికొనుచుం గౌతూహలంబొప్పఁగా
హరిదశ్వుం డఖిలప్రపంచమున కత్యానందమే కూర్చినన్
గిరిసిం దిట్టవె? కౌశికంబు, లటు లీకాలేయ కాలంబునన్
వరశాస్త్రంబులఁ దిట్టుమాత్ర నవియున్ వైయర్థ్యముం జెందునే

శా॥ నాకుం దోఁక తెగెంగదా యిఁక సదానవ్వున్ ననుంగూర్చి నా
మూఁకల్ దీని కుపాయమేదియనుచున్ బుద్ధిన్ విచారించి యీ
తోఁకల్ ద్రెంచికొనుండటంచుఁ బలుకం దూకొన్న గోమాయువ
ట్లీకాలంబున శాస్త్రదూరుఁడగువాఁ డేమేమియో పల్కెడిన్

మ॥ పసరంబుల్ కసవున్ గ్రసించికొనుచుఁ బాలిచ్చెడింగాన నా
కస వేలా మెసవంగరాదో మన మిక్కాలంబునందన్నయ
ట్లసదైనన్ విశయంబులేక యెవఁడో యన్యాయ్యముంజేయ నీ
రసయందుంగల యెల్లవార లటు లారంభించుటల్ నాయమా?

శా॥ ఉల్లంఘించియు శాస్త్రమార్గములఁదా ముచ్ఛృంఖలత్వంబుగా
నుల్లం బెట్టెటుపోవు నట్టులువో నుంకించిరేనిన్ జనుల్
వాల్లభ్యంబటినట్టిదేశమున దుర్వ్యాపారముల్ హెచ్చుచుం
గల్లోలంబులు సంభవించెడిగతిం గాకుండునే ? చూడఁగన్

# XXXVIII

సీ॥ మొకము వంకరదైన ముకురంబు బాగులే
దని నేలకుంగొట్టు వనితలార
ద్రాక్షపం డ్లందఁగా రాక యుండిన నవి
పుల్లనివను నక్కపిల్లలార
అక్కనం బసలేక దిక్కుమాలినదంచుఁ
గంచుకంబునుదిట్టు కాంతలార
ఆటరాకుంటచే నోటిమద్దెలయంచుఁ
బలుకాడు నో యాటవెలఁదులార
గీ॥ తమదు నవభిజ్ఞతను మదిఁ దలఁప లేక
శాస్త్రములఁబట్టి పడఁదిట్టు సాములుండ
నూ కుపమ మేమెయంచు నీలోకమందు
నేలగర్వింతు? రింతటఁ జాలుచాలు.

సీ॥ నోటవచ్చినయట్లు మాటలాడుటె కాని
ప్రాతశాస్త్రిలింకఁ బ. కిరావు
చేతనైనట్లుగాఁ జేయుచుండుటె కాని
ప్రాతశాస్త్రిలింకఁ బనికిరావు
కాలికిష్టంబుగా గమియించుటే కాని
ప్రాతశాస్త్రిలింకఁ బనికిరావు
తనయిష్టమున్నట్లు తినుచుండుటే కాని
ప్రాతశాస్త్రిలింకఁ బనికిరావు
గీ॥ తోఁచినట్లెల్ల నడ్డులే కాచరించు
చుండుటే కాని శాస్త్రిలదండఁ బోము
మదికి నెయ్యది యనుకూల మదియె శాస్త్రి
సార మందురు సంఘసంస్కారు లిపుడు.

## XXXIX

కం॥ శాస్త్రము లీసంస్కారుల
నిస్త్రీవస్త్రములతోడనే తించు నెటో
యేస్త్రీనిం గొనకుండఁగ
వస్త్రములై యేఁచుచుండె నహరహా మహాహా.

### అస్పృశ్యత.

సీ॥ పలల మొక్కఁడు మెక్కి బాపఁడై, కావునఁ
గడజాతి నందఱుఁ గలియవచ్చు
సురఁ ద్రావుచుండె భూసురుఁడొకం డందుచేఁ
జండాలురం దాఁకుచుండవచ్చుఁ
మరకలతో విప్రుఁ డొరుఁడు మెక్కెడిఁగాన
గుడిలోని కంత్యజుల్ నడువవచ్చు
బొమ్మఁడొక్కఁడు తొత్తుపొత్తొనర్చెడిఁగాన
మాలలు మనయింట మనఁగవచ్చు
గీ॥ ననుచు మనసంఘసంస్కారు లవఘళించి
శాస్త్రజాలంబు నుగ్గునూచంబుగాఁగఁ
జూపు యుక్తిప్రయుక్తుల నాప నెంత
ప్రోడయైనను నాలు మాటాడఁగలఁడె ?

ఆ॥ వె॥ రవినిసూపకార రసికత మెప్పించి
పెద్దయైనమాత్ర ఫేరవంబు
ఊళవిడువలేని లీల నలంతివాఁ
డధికుఁడయ్యు నధమపథము విడఁడు.

కం॥ ఎవఁడో యొక్కఁడు భ్రష్టుం
డవిహితగతిఁ జేయుకృత్యమా! సంస్కర్తృ
ప్రవరుల కీఁక నాధారం
బవితథశాస్త్రముల దిట్టలై ఖండింపన్.

గీ॥ నాల్గుజాతులవార లేనాఁడు శాస్త్ర
కర్తలకుఁ గాన్క లిచ్చిరే? కడమవారు
కాన్క లిడకుండిరే? యైనఁగాని, వారి
తారతమ్యంబు గుర్తించి తజ్జ్ఞులగుచు
వారు వారలజన్మానుసారముగను
వ్రాసియుంచిరి స్మృతులపాటిబుద్ధి.

ఉద్బోధము.

సీ॥ వర్ణసాంకర్యంబు ప్రబలుచుండఁగ నింకఁ
దలయెత్తరేల విద్వాంసులార
ధర్మంబులెల్ల విధ్వస్తమై చనుచుండఁ
దలయెత్తరేల విద్వాంసులార
వేదశాస్త్రంబులు పాదుఁదప్పుచునుండఁ
దలయెత్తరేల విద్వాంసులార
లోకంబు తలక్రిందులై కూలుచుండంగఁ
దలయెత్తరేల విద్వాంసులార

గీ॥ ఇట్టిసమయాన మన కేమిపట్టెనదని
మిన్నకుండిన నింక నేమున్న దరయఁ
గొంప కాలుచునుండంగఁ గురకవెట్టి
యందు నిద్రించు మందునిచందము గద.

శ్రీ గర్గభాగవత బాలనీత్యాది గ్రంథకర్తలగు
బ్ర॥ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు.

సీ॥ గోచిపాతనుబెట్టి కొంపలోఁదిరుగునా
గరకుం డటుల వీథిఁ దిరుగఁ జేల
యూరబిచ్చుకఁ జంపి యుత్తమౌషధమని
మెక్కురోగి సతంబు మెక్కఁ జేల
కాసకుష్ఠము లాప గాఁడిదమూత్రంబు
ద్రాగువాఁ డది యెప్డు ద్రాగఁ జేల
ప్రాణోత్క్రమణమున బహుఘోరగరళంబు
నానువాఁ డది సతం బానఁ జేల
గీ॥ కనినగోతిని ముట్టైనకలికి సూత
కంబుతోఁడుతఁ జెలఁగెడికాంతఁ దాకఁ
జేల యోజించుఁడీ నాగరేంద్రులార
దేశకాలపాత్రస్థితిఁ దెలియవలదె?

సీ॥ మేఘగర్భమునుండి మేదినిఁ బడువారి
యొకరుచితో నేల యుండరాదో?
రాచనగరులోన నీచులుసైతము
చేరి కూటం బేల చేయరాదో?
మోహించి నిజసతిఁ బొందినయట్లల
పూని పరాంగనం బొందరాదో
యన్నముఁ భుజియించు నాస్యం బసహ్యమౌ
నొక్కవస్తువు నేల మెక్కరాదో?

గీ॥ యట్టి యస్పృశ్యవిషయంబు నందుఁగూడ
నరయుఁడీ సంఘసంస్కారులార ! మీరు
చచ్చిపుచ్చిన ధర్మశాస్త్రము లటంచుఁ
దెలిసి తెలియనిమాటలఁ బలుకవలదు.

మ॥ అరరే! చాగురే! దోషదూషితమహాహంకారహుంకారసం
కరలుంటాకచయంబు లిమ్మెయిని నిష్కాపట్య వేదోక్త ధ
ర్మరహస్యంబనుబొక్కసంబుఁ గని బల్ మాయోక్తులన్ దొంగిలన్
సరదారుల్ గఁజెలంగి రొక్కపరిఁ గృష్ణా! చూడవే! యాదెసన్.



## శ్రీ శంకర హరిహర తీర్థ దండిస్వాములవారి సనాతన ధర్మోపన్యాసములు - సికింద్రాబాదు.

ఈ క్రోధనసంవత్సర మార్గశీర్ష బ౧౩ శనివారము (12-12-25) సాయంకాలమున మ. రా. రా. వంగపల్లి నీలకంఠముగారను వైశ్య తల్లజుని ప్రార్థన నంగీకరించి శ్రీదండిస్వాములవారు శ్రీవంగపల్లి నీలకంఠముగారు నివసించుచున్న విశాలమగుబంగళాయందు హిందీభాషలోఁ దమమృదుమధురవాగ్వైఖరితో సనాతనధర్మములఁగూర్చి యుపన్యసించిరి. పిదప శతావధానప్రవీణులగు బ్ర॥ చివుకుల వేంకటాచలశాస్త్రిగారును బొలారం స్కూలుపండితులగు బ్ర॥ జగర్లపూడి అమరనాథశాస్త్రిగారును నాంధ్రభాషలోఁ గొంతవడి ధర్మములంగూర్చి యుపన్యసించి యాసభను ముగింపునకుఁ దెచ్చిరి. ఆనాఁటిసభ యవ్యవధిగ సంకల్పంపఁబడినదగుటచే నించుమించు ౧౦౦ మంది

మాత్రమే సభ్యులేతెంచియుండిరి. నాఁడు రాఁజాలనిసనాతనధర్మాభిలాషులు మఱికొందఱు సావకాశముగ శ్రీస్వాములవారి యుపన్యాస సభ మఱియొకటి జరిగిన బాగుగనుండునని సూచించియుండుటచేఁ దిరిగి యీపుష్య శు 3 శుక్రవారము (18-12-25) న శ్రీలాలాగుడియావరణమందు వైశ్యరత్న వంగపల్లి నీలకంఠముగారిచేతనే సనాతన ధర్మముల నుపన్యసించుటకై మఱియొక బహిరంగమహాసభ సమకూర్పఁబడియుండెను. ఆసభకు రమారమి నాలుగువందలమందిసభ్యులేతెంచియుండిరి. అందు బ్రాహ్మణులును వైశ్యులును ఉద్యోగులును విద్వాంసులును జాలమంది నిండియుండిరి. ఆమహాసభయందు జగద్విఖ్యాత యశస్కులగు శ్రీశంకరహరిహరతీర్థ (శ్రీదండి) స్వాములవారు సభ్యుల కానందముగల్గునట్లు హిందీభాషతో సనాతనధర్మములఁగూర్చి కొంతవడి యుపన్యసించి యట్టిసనాతనధర్మములు నశింపకుండుటకై సనాతనధర్మమహావిద్యాలయ మనుపేరఁ గొన్నిపాఠశాలలు స్థాపించి తన్మూలకముగ సనాతనధర్మముల నుద్ధరించుటకై వారు ప్రస్తుతము పూనుకొని యాచరించుచున్న మహోద్యమమునుగూర్చి కొంతముచ్చటించిరి. అటుపిమ్మట (10-11-25) తేదిని శికింద్రాబాదునం దాంధ్రపత్రికాధిపతులగు మ॥ రా॥ కాశీనాథుని నాగేశ్వరరావుగారు అస్పృశ్యతానివారణమునుగూర్చి యుపన్యసించినది మొదలుకొని పత్రికాప్రతిపత్రికామూలమునను, మఱియు శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావుగారీగ్రామమున కత్తఱివచ్చియుండుట వారియగ్రాసనాధిపత్యమున (10-12-25) తేదిని జరిగిన 'ఆదిహిందూజాత్యున్నతి' అనుపేరుగల పత్రికామూలమునఁ దెలిపినసభయందును, మాగ్రామస్థులచే జర్చింపఁబడుచున్నయస్పృశ్యతా విషయము శ్రీస్వాములవారికిఁగూడఁ దెలిసియున్నదగుటచేఁ బ్రకృతోప

న్యాసము సనాతనధర్మములను గూర్చియగుటవలన వేదశాస్త్రోదితము లగు సనాతనధర్మములకు వ్యతిరేకములగు విషయములుగూడ సభ్యుల శ్రేయోభివృద్ధికై యీసభయందు ఖండించుట యావశ్యకమైయుండుటం బట్టి ధర్మశాస్త్రవిరుద్ధమగు చండాలస్పర్శము కూడదనియుఁ జండాలురయం దంటరానితన మారోపించుట కూడదని వాదించునితరు లును బూర్వమం దనేకజన్మములందుఁ జండాలురైయుండి యేదేని పుణ్యవశమున నుత్తమజాతులలో జనించి పూర్వజన్మవాసన పోకుండు టచేఁ జండాలపక్షపాతులై వాదించుచుందురనియు నట్లే పూర్వమం దనేకజన్మములయం దుత్తమజాతులంబుట్టి యేదేనిపాపవశమునఁ జండా లురై జనించి పూర్వజన్మవాసనానుసారముగ నుత్తమజాతిలక్షణము లతోఁ గూడియుండుట సహజమనియు వక్కాణించిరి. మఱియు నింక ననేకహేతువులతో నస్పృశ్యతానివారణమును నిష్పక్షపాతబుద్ధులును మహాత్ములునగు శ్రీస్వాములవారు ఖండించిరి. ఈసభకు నస్పృశ్యతా నిరాకరణవాదులును వచ్చి యాయుపన్యాసమును విని రెండుమూఁడు ప్రశ్నలను వైచి సమాధానములం గైకొని చనిరి. సర్వవిధములఁ దత్సభ జయప్రదముగా జరిగెను. అంతట శ్రీస్వాములవారికి మంగళనీరాజన ములతోడను జయజయధ్వానములతోడను సభ ముగిసెను.

ఇట్లు సుజనవిధేయుఁడు,

గొరావర్ఝుల ఆదినారాయణశాస్త్రి.



## —• మ ణి భ ద్రో పా ఖ్యా న ము •—

కం॥ “తనరెడుఁ బుష్పాదిత్యుండను మఱియొక దేవుఁ డచట, నాదేవుఁడు తా
మును యాజ్ఞవల్క్యనామక మునిచేతఁ బ్రతిష్ఠితుండు మునివరులారా! ౨౧౪

సీ॥ పుత్రసంతతిఁగోరి పూజించుమనుజుండు సత్పుత్రులంగాంచి సంతసించు,
నర్థంబుఁగాంక్షించి యర్చించుమర్త్యుండు లక్షాధికారియై లలివహించు,
నరివినాశముగోరి యజయించు సుజనుండు హతసమస్తారియై యశముఁబెంచు,
విద్యార్థియైకొల్చు విమలవంశభవుండు విద్వద్వరిష్ఠుఁడై విపులమించు,
మిత్రవారసప్తమీకృత తద్దేవదర్శనంబువలనఁ దద్దినంపుఁ
బాపమెల్లఁ దొలఁగు బ్రాహ్మణవరులార! తద్దఁ బెద్దదయ్యుఁ దక్షిణమున, ౨౧౫

వ॥ ఆ సప్తమీభాను వాసరంబునం జేయు పుష్పాదిత్యపూజచే సూర్యోదయంబునఁ జీఁకట్లువోలె సంవత్సరకృతంబగు పాతకంబును సంక్షయంబుఁజెందెడి, ఫలహస్తులై యాదేవునకు నూటయెనిమిది ప్రదక్షిణంబు లొనరింపఁ బుట్టినది మొదలు గిట్టువఱకుం జేసిన యొట్టికలుషంబులును విలయంబునందు, నిదియునుంగాక యాప్రదక్షిణంబులుచేయు జనం బేకోర్కులుగోరిన నాకోర్కులెల్ల సిద్ధించు, నిష్కామునకు మోక్షంబె ఘటియిల్లెడు, మేషసంక్రమణంబుగాని తులాసంక్రమణంబుగాని యాదిత్యవాసరసంయుతంబైనప్పు డాదేవునకు స్నపనక్రియ యొనరింప నభీష్టంబు సిద్ధించుఁ గావునఁ బుష్పాదిత్యుండు పూజనీయుండును దర్శనీయుండును నయ్యెడిఁ, జమత్కారపురస్థ సర్వదేవతాదర్శనంబునంగలుగు ఫలం బీయొక్కని దర్శనంబుననే చేకూరెడు,”
నని యిట్లు వక్కాణించుటయు బుషులిట్లనిరి, ౨౧౬

ఆ॥ “వాస్తవముగ యాజ్ఞవల్క్యవాచంయమవరుఁడు తత్ప్రతిష్ఠ జరిపియున్న
నీ సుదైవతమున కిట్లు పుష్పాదిత్యనామ మేరుపడుట కేమికతము?” ౨౧౭

వ॥ అనిన వెండియు సూతుండు ౨౧౮

కం॥ “ఏతద్విషయంబున నొకయైతిహ్యముఁ జెప్పువాఁడ, నదివినుపైఁ ద
ద్ధేతువు తెల్లంబగునీ కోతాపసవర్యులార! యూకొట్టుఁ డికఁ, ౨౧౯

సీ॥ తోవలరాయిడికానిత్రోవ కడ్డంబౌచుఁ గోఁటగోడలు చాలఁ గొమరుమిగుల,
గురుతల్పమెక్కిన కూళ వీఁడని శశిం బ్రాసాదముల సతుల్పండినుంప
నారామతరుశాఖలందలి పుష్పము ల్పగటిచుక్కలుగ నభ్రమునఁ దోఁప
సింధువు ల్చుట్టును జేరవసించెనాఁ గమలాకరములు లెంకలను వెలయ
వైదిశంబని విఖ్యాతివడయు నొక్కపట్టణంబునఁ దాఁ బట్టభద్రుఁడగుచు
వ్యాధిదుర్భిక్షచోర వివర్జితముగ వసుధఁబాలించె మును చిత్రవర్మనృపతి, ౨౨౦

వ॥ ఆపురంబున జాతిచే క్షత్రియుండై మణిభద్రుండని యొక్కఁడుండెడు,

సీ॥ తెంపలిచెట్లకే వేసి దోఁటీలను గుంజంగఁదగు మరుగుజ్జతఁడు,
కాయమంతటఁగూడ ఘనమైనముడతలు గలిగియున్నట్టి దుర్గలితుఁడతఁడు,
తలయును మొలయును దెలతెలగా మేనిపస గోలుపోయిన ముసలియతఁడు,
సౌష్ఠవశూన్యమౌ సర్వాంగములతోడ రోఁతఁబుట్టించు విరూపుఁడతఁడు,
వలసినంత ధనముగలిగినవాఁడయ్యుఁ దానుదినక యొరులకేని యిడక
వడ్డిఁబెంచి బీదవారల కొంపలమ్మించిమించుచుండు కించతండు, ౭౨౧

సీ॥ ఎద్దానియధరోష్ఠ మీక్షింప దొండపం డెద్దానివిగ్రహం బించుకోల
యెద్దానికనుదోయి యిందీవరవిశాల మెద్దానిగుల్ఫంబు లెఱుఁగరాని
వెద్దానిసెన్నడు మెన్న ముష్టిగ్రాహ్య మెద్దానియందంబు హృదయహారి
యత్స్పష్టగాత్రంబు లత్యంతరక్తముల్ యన్నారి మూఁడింట నతిగభీర
యట్టి యఖిలలక్షణాన్విత నిజజాతికన్య యొకతె తనదుకంటఁబడఁగ
నట్టివికృతుఁడయ్యు నమ్మణిభద్రుఁ డాతన్విఁ బెండ్లియాడఁదలఁచి యపుడు

వ॥ దారిద్ర్యపీడితుండగు దానితండ్రిం బిలిచి తన కిమ్మని యడుగుటయు నాతఁ డాసంగతి భార్యకు వినిపింప నాయమ దుఃఖితయై మూర్ఛిల్లెనంత నానిరుపేద యాపె సేదదేర్చి

సీ॥ "ధనవంతునకుఁ గన్యధారవోయఁగలేని విత్తహీనునివిద్య విద్యయెకొ,
యైశ్వర్యసంయుతు నల్లుఁగాఁబడయని నిర్భాగ్యునేరుపు నేరుపొకొ,
యర్థవంతునకింటి కాత్మజం బంపని యర్థశూన్యుని యర్థ మర్థమొకొ,
భాగ్యవంతున కాత్మభవఁ బత్నిఁజేయని భాగ్యహీనుని ప్రజ్ఞ ప్రజ్ఞయొకొ,
భాగ్యయుతునకుఁ జుట్టమౌఁ బరుఁడుగూడఁ, జుట్టమును బరుఁడగు భాగ్యశూన్యునకును
గిరులనుండి సరిత్తులక్రియఁ బెరుంగు నర్థములనుండి పనులెల్ల నగుచునుండు,

ఉ॥ పూజ్యుఁడుకానివానికిని బూజయొనర్చుచునుండ్రి పోయి సం
త్యాజునిగూడ శ్రద్ధమెయి దగ్గఱఁజేరి నుతింతు రన్వహం
బిజ్యునక ట్లవంద్యునకు నెంతయు వందనమాచరింతురి త
త్ప్రాజ్యధనప్రభావమున ధారుణిలోపల సర్వమానవుల్, ౭౨౬

చం॥ అశనమునుండి యింద్రియముల ట్లఖిలక్రియ లౌనుగానఁ దా
దృశమగు కార్యసాధనము పృథ్విఁ గనంబడ దెంచిచూడఁగా,
శిశువులుమున్నుగాఁగలుగు జీవులు సర్వులుగూడ దానికై
వశులయి నిప్పులోనయిన వచ్చి పడకై గమకింతు రెంతయుణ్, ౭౨౭

కం॥ ధనవిరహితు లగువారిఁ దమ జననీజనకులనుగూడ సంత్యాగముఁజే
యను సాహసింతు్రితక్కినజనులను విడుచుటకు నేమిసంశయముండుఁగ" ౨౨౮

## —• మణిభద్రుండు పుష్పుఁడను బ్రాహ్మణుని గొట్టించి యవమానించుట •—

వ॥ అనియిట్లు రహస్యంబుగా బోధించుచు నాయమయు నందుల కియ్యకొనియె నంత నాక్షత్రియుండు మణిభద్రుని పాదంబులుగడిగి హస్తంబున సాక్షతంబగు జలంబు విడుచుటయు నతండు ౨౨౯

ఆ॥ "పెండ్లిసేయు మిపుడె ప్రీతి నాకును నీదుకూఁతునకును నెలమిఁ గూడియుండఁ,
దన్నిమిత్తముగనె త్వద్గృహంబునకేను వచ్చినాఁడ మామ ! వాస్తవముగ" ౨౩౦

వ॥ అనిపలుకుటయు నా క్షత్రియుండిట్లనియె, ౨౩౧

కం॥ "దినవారగ్రహము లియ్యెడ ననుకూలములై రహింప, వదియుఁ క్షగా కి
ప్పుని దక్షిణాయనమునను బొనరింపఁగ రాదటండ్రు భూసురవర్యుల్, ౨౩౨

ఆ॥ ఇట్టిసమయమునను నెవతెవివాహంబు జరుపఁబడునో వెస విచారముడిగి
దాని కొక్కయేడు దాఁటకమున్న వైధవ్యమేరుపడును దప్పకుండ, ౨౩౩

ఉ॥ జ్యోతిషికు ల్వచింప నిటు సంశ్రవణంబొనరించినాఁడ, నా
హేతువుచేత వేగపడ కీవు శుభగ్రహదినాదికాన్వితం
బై తగు నుత్తరాయణమునం దరుదెంచి వివాహమాడి సం
ప్రీతినిబొమ్ము, కల్గుదురు బిడ్డలునీకు, శుభంబుచేకురుఁగ" ౨౩౪

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయు మణిభద్రుండు ౨౩౫

ఆ॥ "అగ్నిదేవతాక మగుఁగాక నక్షత్రమగునుగాక దక్షిణాయనంబు,
మంచిమూర్తమునకు మనము యోజింప సంవత్సరాంతమగును వాస్తవముగ, ౨౩౬

ఆ॥ మన్మథాగ్ని లేచి మామకదేహంబుఁ దగులఁబెట్టఁజొచ్చెఁ, దాళఁజాలఁ,
గరుణయుంచి యిపుడె కల్యాణమొనరింపు, మడిగినంత విత్త మిడుదునీకు" ౨౩౭

వ॥ అని వేగిరించుటయు నాక్షత్రియుండు ధనలోభంబునంజేసి యిష్టంబు లేమి దుఃఖార్తయు నశ్రుపూర్ణేక్షణయు నగు నాత్మజాత నగ్నిసాక్షికంబుగా నతని కంటఁగట్టి యాక్షణంబ యంపించె, మణిభద్రుండు తత్సుందరాంగిని దనయింటికిం దోడుకొనిపోయి వలదు కుయ్యో మొఱ్ఱో యని వాపోవుచున్నను బలాత్కారంబున సురతంబున కుపక్రమించి యనేకవిధంబుల బెదరించియుఁ బీడించియుఁ దెల్లవారు వఱకు కేళిట్లో తన వ్యసనంబు తాఁ దీర్చుకొనుచు నిదియేమియంత్యకాలమని నొక్కఁడుఁ

జీవాట్లు పెట్టుదురో యను నీర్ష్యం బరిచారకుల నందఱిని వెడలనడచి పుంస్త్వ
హీనుండగు పురుషు నొక్కనిమాత్ర ముంచుకొని ౨౩౮

సీ॥ "పూర్వంబు మద్గృహంబున జీతమునకుండి ప్రీతిపాత్రుండైన భృత్యుఁ డేని
కడుపు కాటుకకట్టఁ గట్టినకడ నెల్లఁ గలయఁదిర్గెడి యిచ్చగాని నేని
యింద్రియపాటవం బిసుమంతయును లేక వర్తించు ముదుసలివాని నేని
వ్రతశీలుఁడై యెల్లవాంఛల డిగనాడి చరియించుచుండెడి సాధు నేని
గీ॥ నాదు కడపలోనఁ బాదంబు నిడకుండ నీ వహర్నిశములు నిలువ సింపు"
మనుచుఁ గాఁపుపెట్టి తనదైన వడ్డివ్యాపారమునకు రాచబాటలోన ౨౩౯

వ॥ ఒక్క మేడ యేర్పఱిచుకొని మంత్రిలుం దానును బగలెల్ల నందయుండుచు దురాత్ముండై పిల్లనిచ్చిన మామకుంగూడఁ బిడిచెఁడన్నంబు పెట్టక కట్టు పుట్టంబులం దప్పఁ గాంత నేని కనకాభరణంబులం గైసేయక యామద్వయంబున కావాసంబున కరుదెంచి భార్యకును దనకును బ్రాహ్మణున కొక్కనికిని సరిపోవు తండులంబులం గొలిచిపోసి యన్నంబు తిన్నతోడన వ్యాపారైకమందిరంబున కరిగి మఱల సాయంకాలంబున కరుదెంచుచుండుటయు ౨౪౦

సీ॥ పాథఃప్రపూర్ణమహాపల్వలంబుననుండి మహిమీఁదఁ బడినట్టి మత్స్యభంగి
రవి యస్తమించినయవల నెట్టో త్యక్తవల్లభయౌ చక్రవాకిపగిదిఁ
బతి సంచరించెడి పథమెఱుంగఁగలేక యుల్లాడు నల రాజహంసిమాడ్కి
నతిభయంకరమైన యటవీస్థలంబులో సగఁడు మాన్పడఁ గుందు మృగివిధమునఁ
దద్దురాత్ముపత్ని తాఁ దన్మహాహర్మ్యమంతటికిని నొకతయగుచు నెంత
వఱకుఁ గూడఁ బ్రొద్దు జరుగమికిని నిత్యము మ్రలికము గుడుచుచుండవలసె, ౨౪౧

వ॥ అతం డహరహంబును నన్నమున కరుదెంచెడి యవనీసురుం గూర్చి ౨౪౨

తే॥ "బాపఁడా! మద్గృహమున సాపడెడి యంతసేపుఁ దలవంచుకొనియుండు, చెప్పినాఁడ,
నట్లు కాకుండఁ దలయెత్తి యస్మదబలవంకఁ జూచితి వేని నీ కింక మనవు" ౨౪౩

వ॥ అని చెప్పుచుండెడివాఁడు, చెప్పుటయే కాక తలయెత్తి తనతరుణిం బరికించినందులకై యనేకుల తలలు బ్రద్దలొనరించికూడ నున్నవాఁడు, దానం జేసి భీతిల్లి యెవ్వరును వానియింటికి భోజనంబునకుఁ బోవకుండిరి, యంతఁ గొంతకాలంబునకుఁ బుష్పండను భూసురుండు తీర్థయాత్రాప్రసంగంబునఁ దత్పురంబున కరుదెంచె, నతండు చూడ సొంపైనవాఁడును బూర్వవయస్కుండును, దారి నడచినడచి యాఁకలిగొని మట్టమధ్యాహ్నంబున నందరుదెంచి యాయా గృహస్థులయిండ్ల కన్నార్థియై యరుగనరుగ నంద

అను మణిభద్రునింటికిం బొమ్మని చూపుటయు నతనిఁ గదియనేగి భోజ్యంబును
యాచించి ౨౪౪

కం॥ "తలకాయ వంచుకొనియే సలుపఁగవలె భోజనంబు క్ష్మామరవర! యా
లలి సలుప కస్మదంగనఁ దిలకించితివేని మైని దెబ్బలువడెడిన్" ౨౪౫

వ॥ అని తాను నాజ్ఞాపింపఁబడి ౨౪౬

కం॥ వేదాధ్యయన మొనర్చితిఁ, బోఁదలఁచితిఁ దీర్థసేవఁ బొనరింపఁగ, నా
మీఁదట నాకలిఁ గొంటిని, బాధ్యుఁడ నీ కేల యన్యదారనుఁ జూతున్" ౨౪౭

వ॥ అని వాక్రుచ్చుటయుఁ మణిభద్రుండు మంచిదిరమ్మని తనవెంట రాజమార్గంబునం దోడ్కొనిపోయి ద్వారపాలకుండగు కొజ్జావాని సమీపంబునం దాబాపనిం గూర్చుండఁబెట్టి గృహంబునం బ్రవిష్టుండై పరిమితధాన్యంబు భార్యకుం గొలిచియిచ్చి దేవతార్చనచేసికొని వైశ్వదేవాంతంబున వసుధామరు నాహ్వానించి చరణంబులు గడిగి యర్ఘ్యపాద్యాదులాచరించి యన్నంబు వడ్డించుటయు నతండు కూర్చుండి భుజించుచు నధోముఖుండయియె యంబుజసన్నిభంబులగు నతని యర్ధాంగి యంఘ్రు లవలోకించి యవలోకించి వయోవంతుఁడగుట వలపుపుట్టి నేరక ముఖంబు వీక్షించె, నంత మణిభద్రుండు కుపితుండై నపుంసకుం బిలిచి వీని విడంబింపుమనుటయు వాఁడు వచ్చి ధరామరు శిరస్స్ఫోటనంబు గావించెఁ, దత్క్షణంబ యతఁడు నెత్తురుగ్రక్కుచు నేలం గూలుడుఁ దద్భృత్యుం డాయన పాదంబులు రెండుం బట్టుకొని జనసంచారభూయిష్ఠంబగు చతుష్పథంబువఱకు జఱజఱ నీడ్చుకొనిపోయె, నప్పు డప్పురవరంబునంగల ప్రజలెల్లరు నది విలోకించి యత్యంతము హాహాకారంబునొనరించి, రందుఁ గొందఱు జాలిం దూలి చల్లనీళ్లు చల్లి చెవులు మూసిరి, యంతఁ గొంతవడికి నెట్టకేల కాబ్రాహ్మణుండు తెలివినొందె ౨౪౮

ఆ॥ "ఎవనిముల్లెఁ గూడ నే దొంగిలింపను, నెవనియాలిమీఁద నేని పడను,
నిట్టివానిఁబట్టి కొట్టించె మణిభద్రుఁ, డార్యులార! చూడుఁడయ్య మీరు, ౨౪౯

ఆ॥ తీర్థములను గ్రుంకఁ దిమ్మరుచున్నాఁడ, బ్రాహ్మణుఁడను, మఱియు బ్రహ్మచారి,
నట్టివాని నింటి కన్నంబునకుఁ బిల్చి యిట్లొనర్చినాఁడు, హితమె యిద్ది ? ౨౫౦

కం॥ ఏఁ దెవ్వఁడు నీపురమున లేఁడొకొ జనులార! యున్న లేశముగూడన్
గీడొనరింపని బాపని మా డేలా పగులఁగొట్టు మణిభద్రుఁ డిటుల్" ౨౫౧

వ॥ అని నిలపించుటయు జనులిట్లనిరి, ౨౫౨

శా॥ "రాజానుగ్రహపాత్రుఁడైన యితఁ డీర్ష్యాపూరితుండౌచు నీ
రోజం బెక్కురుజన్నిగట్టులను గుయ్యోయ్యనాఁగఁ గొట్టించె, ని

సీ్న జాల్మ! యనతేఁ డొకండుఁ, గనుకం జింతిల్ల కేతెమ్మ, నిక
బూజింపంగలవార మన్నమిడి రో భూదేవ! మేమియ్యెడక" ౨౫౩

—* పుష్పుండు సూర్యునివలన వరంబును బడయుట *—

వ॥ అనియిట్లు బోధించుటయుఁ బుష్పుండు క్రుద్ధుండై ౨౫౪

ఆ॥ "ఈదురాత్మకునకు నేను బ్రీతిక్రియ యాచరించుదాఁక నన్నమును బు
జింపఁ గానఁ దెలియఁజెప్పుఁడీ యేదేవుఁ డిట వరప్రదుండొ యిద్ధమతులు!" ౨౫౫

వ॥ అనియడుగుటయు మఱియుఁ బ్రజలిట్లనిరి, ౨౫౬

తే॥ "ఒక్కఁడే దేవుఁ డిచ్చోట నున్నవాఁడు శీఘ్రసిద్ధిప్రదుండయి క్షితిసురాగ్ర్య!
మఱియునొకదేవతయు నిందుఁ బరఁగుచుండె, భర్తులకు నావెగూడ శుభంబు

వ॥ అనినవిని క్రమ్మఱఁ బుష్పుండు ౨౫౭ [లొసఁగు, ౨౫౮

తే॥ "ఎవ్వరా దేవి? దేవుండు? నీస్థలమున కెంతదవ్వునను న్నారు? లేదిస్థాన?
మంతయును మీర లోజనులా! సుంత కరుణయుంచి వాక్రువ్వుఁ డయ్య, నుతించువాఁడ,

వ॥ అనివేఁడుటయు వెండియుం బ్రజలు ౨౬౦

తే॥ "అల చమత్కారపురమున యాజ్ఞవల్క్యసుప్రతిష్ఠితుఁడైనట్టి సూర్యదేవుఁ
డున్నవాఁడని మును వినియున్నవార, మనఘ ప్రత్యయకారకుండఁట యాతండు,

ఆ॥ సవితృవారయుక్తసప్తమి నూటయెన్మిదిప్రదక్షిణములు మిగులభక్తి
హస్తధృతఫలముగ నాదేవునకుఁ జేయ నభిమతార్థసిద్ధి యగునటండ్రు, ౨౬౨

తే॥ అట్లు కాశ్మీరసంస్థితయైనయట్టి శారదాదేవిముందఱఁ జాలభక్తి
నుపవసించినయంతనే యొనరుసిద్ధి, యేమిగలదింకఁ జెప్ప మహీసురేంద్ర!" ౨౬౩

వ॥ అనినవిని యప్పు డచ్చోటనుండి చమత్కారపురంబునకరిగి సప్తమీభాను
వాసరంబున స్నానంబొనరించి శుచియై సమాహితమతిం దద్యాజ్ఞవల్క్యప్రతిష్ఠితుం
డగు నాదిత్యున కేకైకనారికేళఫలప్రదానపూర్వకంబుగా నష్టోత్తరశత ప్రదక్షిణంబు
లాచరించి క్షుత్క్షామకంగుండును బరిశ్రాంతుండును దృఢభక్తియుతుండును నై తదగ్రం
బునం గూరుచుండి "యదేతన్మండలంజపతి, సప్తయుంజంతి రథమేకచక్రం" మొద
లగు మంత్రంబులును మఱియు సూర్యప్రీతికరంబులగు స్తోత్రంబులును మఱియొక
భానువారంబువఱకు నుచ్చైస్స్వరంబునం బఠించినను దద్దేవుండు పరితుష్టుండు గాకునికిని
బౌర్ణమాసీదినంబునఁ బరమవైరాగ్యమూని భూనామమంత్రంబున స్థండిలార్థంబుగా
భూమి నుపార్జించి హస్తమాత్రంబగు స్థండిలంబు స్థండిలంబునం గల్పించి యగ్నిమీ
ళేయను మంత్రంబున నం దగ్ని నారోపించి తృణైః పరిస్తృణామి యను మంత్రంబున

బ్రహ్మాసనంబొసంగి సుత్రామాణ యను మంత్రంబున సమిధల స్థాపించి ప్రోక్షణ పాత్రలాసాదించి సకలపాత్రలను స్రువాదులను యథాక్రమంబుగం బ్రోక్షించి యంత హవిస్థానంబున నిజతనువుం గల్పించి యాచార్యవిధానంబుచే సూర్యాయత్వా యనుమంత్రంబున దేవతాస్థానమందు న్యాయమైన గ్రహణప్రోక్షణంబులు గావించుచు "అయుంతఇధ్మఆత్మా" యనుమంత్రంబున సమిధల మంత్రించి "అగ్నయేస్వాహా, సోమాయస్వాహా, యను రెండుమంత్రంబుల రెండాజ్యాహుతులు వ్రేల్చి భూర్భువ స్స్వయని వ్యాహృతిహోమంబొనరించి 'ఏతేశత"మున్నగు మంత్రంబుల దారుణంబుగా వ్రేల్చి దేవా! పత్యక్షుడగుమని యాహ్వానించి పదపడి శస్త్రంబుచే ఖండించి లోమంబులనుండియు దిశలనుండియు విదిశలనుండియు నిజమాంసములు హవిర్భాగుని యందు వ్రేల్చివ్రేల్చి తుద కాత్మనుగూడ వ్రేల్పంబోవుటయునూర్యుండు ప్రత్యక్షంబై సాదరంబుగా స్వకరంబునం బట్టుకొని ౨౬౪

చం॥ సలుపకువిప్ర! సాహసము, క్ష్మాస్థలి నెవ్వండు నెప్పుడేని యే
స్థలమున నిట్టిహోమమును సల్పియెఱుంగడు గాన నేను నీ
సలిపినదాని కెంతయును సంతసమందినవాడ, నేమిగా
వలయునో చెప్పు, మీదగనివాంఛితమేని యొసంగిపోయెదన్" ౨౬౫

వ॥ అని యనుగ్రహించుటయుం బుష్పుండిట్లనియె, ౨౬౬

కం॥ "తుష్టింజెందితివేని మదిష్టం బొడంగూర్చెదేని యి మ్మిరుఘుటికల్,
దుష్టాత్ముండొకండు నాకు నరిష్టము గావించె, జని జయింపంగవలయున్, ౨౬౭

సీ॥ క్షత్రియజాతినే జననమందెనుగాని కులమున కయశస్సు గూర్చినాడు
అర్థార్జనంబునం దాటితేలెనుగాని పిసినిగొట్టుతనంబుం బెంచినాడు
వామనుండనుఖ్యాతి వడయంగల్గెనుగాని కరము వైరూప్యముం గాంచినాడు
ముడతలువడ నొడలుమ్మదకండయ్యెనుగాని స్త్రీమోహమునం బట్టు చిక్కినాడు
పాడు దేహాభిమానంబు వీడలేక పరమనీచాత్మకుం డనంబడుచు సకల
జనులచే దూష్యమాణుండై జగతి వైదిశాఖ్యపురమున మణిభద్రుండనెడివాడు
తే॥ ఘుటికలనురెంట నొకదానిం గొంచు నేను బుక్కిటం బెట్టుకొని యెన్నిపూటలుండ
నన్నిపూటలు మణిభద్రుడగుచు నుండవలయును వికల్ప మొక్కింత గలుగకుండ
తే॥ రెండియును ద్దాని నానోటినుండి తీసి యెపుడు రెండవదానిని నే ధరింతు
నపుడు నారూపమును నేన యందవలయు వాని చెడురూపు వానికే వదలిపెట్టి,

చం॥ ఇదియునుగాక వానియిలు నేంజని చూచినయంతమాత్ర నే
పదిలముచేసి యుంపబడు బంగరు వెండి ధనంబు ధాన్యమున్

విదితములై చెలంగవలె, వేయువచింపఁగ నేల, వాని యా
స్పద మఖిలం బెఱింగి ప్రజ వాఁడె యనంగ మెలంగఁగావలెన్, ౨౨౧

ఆ॥ వానిరూపుదాల్చి వానిగృహంబులో నుండునపుడు తత్పురోత్తమమున
నెవనికేని భేద మేర్పడరాదుమా సకలవర్తనమున సవితృదేవ!" ౨౨౨

వ॥ అనియిట్లు వరంబుఁగోరుటయు భాస్కరుండు ౨౨౩

తే॥ "నోటధరియించుమాత్రన నూత్నరూపములవడంజేయుఘుటికాద్వయము గ్రహింపు,
మొకటి నల్లనిదందులో, నొకటి తెల్లనిదగనుండును బుష్పవనీసుపర్వ! ౨౨౪

క॥ నల్లనిఘుటికం బుక్కిట నల్లనధరియింప నతనియాకృతి నొందెదవున్,
తెల్లనిదిదాల్పఁ గ్రమ్మఱఁ దొల్లిటియాకృతి ఘటిల్లుఁ దప్పక నీకున్" ౨౨౫

వ॥ అని వక్కాణించుటయు వెండియుఁ బుష్పండిట్లనియె, ౨౨౬

ఆ॥ "అస్మదీయహృదయమం దొక్కసందేహ మేరుపడియె నోసురేశ! యిపుడు,
దానిఁ దీర్చితేని తప్పక నీకీర్తి విస్తరించు, దానినిను వచింతు, ౨౨౭

మత్తకోకిల॥ ఆదివారపుసప్తమిన్ ఫలహస్తుఁడై యొకనాటికి
న్మీఁద నెన్మిదివారములుప్రహీనీకుఁ దా వలగొన్నచో
నేదురాత్మునకేని మెచ్చి యభీష్టమిత్తువటంచు నే
వైదికశ్రేష్ఠజనుల్వచింప దివాకరా! శ్రవణించితిన్, ౨౨౮

ఉ॥ పాపికి మూఢచిత్తునకె వైశమ సిద్ధియొసంగు నీవు యా
త్రాపరతం జతుశ్శ్రితులఁ దప్పక పాతము సేసినట్టి యీ
బాప! సప్తరాత్రు లుపవాసములం గృశియింపఁజేసి హా
మోపరి దర్శనంబిడి, తహో! యిది యేమికతంబొ చెప్పుమా" ౨౨౯

వ॥ అని యిట్లు ప్రశ్నించుటయు సూర్యుండు ౨౩౦

కం॥ 'తామసభావముతోడను నోమహీసుర! నీ విదంతయును జేసితి, విం
కేమని చెప్పుదు నీతోఁ, దామసమునఁ జేయుపని వృథాయగు మందున్" ౨౩౧

వ॥ అని వాఱిచ్చి సూర్యుండు ఖండితంబులగు నతని యవయవంబులు నిర్వ
ణంబులుగా స్వకరంబున స్పృశియించి ప్రసన్నవదనుండై మఱియు నిట్లనియె, ౨౩౨

ఉ॥ ఇట్టులె సౌమ్యభావమున నెంతయు నర్కసమిత్కుశాక్షతల్
బెట్టి సహస్రవారములు వేల్చినవాని మనంబులోన ను
న్నట్టి సమస్తవాంఛలను నాతఁడు కోరనివానిఁగూడ నేఁ
నెట్టుమటంచు నిత్తుఁజుమి బ్రాహ్మణ! యున్న నిజంబుఁ జెప్పితిన్" ౨౩౩

వ॥ అనియిట్లు పలికి సహస్రాంశుఁడే మార్గంబునఁ జనినదియు నేర్పడకుండ దీపంబు
వోలెఁ గనఁబడక యచ్చట నే యంతర్ధానంబుఁ జెందె, ౨౩౪

౮ చేలూరి రామన్న గుప్తగారు, సదాశివుని పేట

౯ రాచూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి

౧౦ ఘంటంభట్లుగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౧ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం

౧౨ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం

౧౩ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట

౧౪ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

౧౫ భాస్కరరాయని వెంకట రామయ్యగారు, వంగపల్లి

౧౬ నరసింహస్వామివారు, యాదగిరి

౧౭ బీరకాయల హనుమంతరావుగారు, రాయగిరి

౧౮ పాలపర్తి గోపాలకృష్ణయ్యగారు, బెజవాడ

౧౯ జూలూరి వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు

౨౦ తుమురుగోటి నరసింహరావుగారు, తిరుమలగిరి.

౨౧ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి

౨౨ నాస్నెపాటి వెంకటసుబ్బారావుగారు, నర్సాపురం

౨౩ జానపాటి సుబ్రహ్మణ్యంగారు, ఆక్టింగు కరణం, పాపయపాలెము

౨౪ చిక్కరాజు పట్టపల్లి రావుగారు, కరణం, చెలకుర్తి

౨౫ కవులూరి నరసింహారావుగారు, ఈలప్రోలు

౨౬ గోశేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు

౨౭ నడింపల్లి నరశింహారావుగారు, రిజిష్ట్రాఫీసు క్లార్కు, క్రోసూరు

౨౮ రాచకొండ వెంకటరామయ్యగారు, యెనమదల

౨౯ నారపరాజు వెంకటలక్ష్మీనరసింహారావు దేశముఖుగారు - తమ్మపరం

౩౦ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్స్పెక్టరు - పిడుగురాళ్ళ

౩౧ మండ చినవెంకయ్యగారు, దండమూడి.

౩౨ శ్యామాపంతులగోపాలరావుగారు-బందోబస్తుమొహతెమీన్-వరంగల్లు

౩౩ తిరుమణికల్యాణ చక్రవర్తి వరదాచార్యులఅయ్యవార్లంగారు-శాతాపురం

౩౪ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం

౩౫ చక్కిలం పాపయ్యగారు-ముసలాపురం

౩౬ తాళ్ళవెలిమె లింగన్న మొకద్దంగారు-గడిపెద్దాపురం

౩౭ కిషన్ రావు దేశపాండ్యాగారు- తాళ్ళపల్లి

౩౮ వెంకటరాజయ్య మక్తేదారు, సీతారాంపురం.

౩౯ తొర్లకొండ లక్ష్మారెడ్డిగారు, క్షీరసాగరం.

౪౦ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం

౪౧ సంగరాజు గోపాల్ కిషన్ రావు దేశముఖుగారు, పాపురం

# అభినవసరస్వతి.

పత్రికాధిపతి:— జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3—0—0

## ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కరణీకోద్ధారిణి [పూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 10 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 11 | పుళిందావివాహము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 12 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 13 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0 | 4 | 0 |
| 14 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 8 | 0 |
| 15 | పశ్యాంపుశ్యాం | ... | 0 | 2 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 17 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 18 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 19 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 20 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 21 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 22 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము | ... | 0 | 1 | 0 |
| 28 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము (౧ సంపుటము) | | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 26 | భారతీయప్రబోధము (పిశుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము,

జానపాడు, పెదగరాళ్ళపోస్టు,

గుంటూరుజిల్లా